శ్రీరస్తు.

# స్త్రీనీతిరత్నాకరము.

ఇది

శ్రీశంబరద్వీపవాసియైన

చెన్నాప్రగడ రామమూర్తిచే

రచియింపఁబడినది.

మొదటికూర్పు.

శ్రీవాణీముద్రాక్షరశాల

బెజవాడ.

1898.





తరంబుగూడ సంభవించిన

# పీఠిక.

ఒకనాటిరేయి నేనును పండితులగు నామిత్రులును కలిసి స్త్రీవిద్యాభ్యాసమునుగూర్చి ప్రసంగించుచుండఁగా నిచ్చటి బాలికాపాఠశాలా ప్రధానోపాధ్యాయుఁడును మన్మిత్రవర్యుఁడును నగు బ్రహ్మశ్రీ ముష్టి రామకృష్ణశాస్త్రిగారు నన్నుఁజేరి యిట్లని వాక్రుచ్చిరి.

ఉ॥ వినుమిటు మిత్రశేఖర! కవిత్వపటుత్వము నేర్చియుంటివి।
వసుమతి బాలికామణుల కందరకుందగ యుక్తమై భువిన్।
దనరెడు నీతిగ్రంథమొక దానిని వ్రాయుమటంచు బల్కఁగా।
మనమున బొంది సంతసము మత్సఖు వాంఛను దీర్పఁ జెప్పితిన్।

కాని,

ఆ॥ వె॥ ఈశ్వరేచ్ఛ చేత నిలఁ బాసి మాయంబ।
సద్గుణనికురుంబ శాయిమాంబ।
శోకమిడుచు నుబరలోకవాసినియౌట!
చే నశించె మతివిశేషమెల్ల॥

హృదయవిదారణదారుణంబైన యిట్టిదుఃఖమును బొంది కుందుచుండఁగా గోరుచుట్టుమీఁద రోఁకటిపోటు చందమున మరల దుస్సహ దీర్ఘ విదారణంబైన సోదరమరణంబుగూడ సంభవించిన

హేతువుచేత మదికుదురమింజేసి వాకియ్యదియసాధ్యంబని యూఱకుంటిని, కానిమరలమిత్రోత్సాహభంగంబు సేయఁజాలక నేనీగ్రంధమును వ్రాయఁబూనుకొంటిని. కాన నింపాకవేఁ బ్రమాదవశంబున,

ఆ॥ వె॥ తప్పులుండెనేనిఁదగదిద్దిసునబుద్ధి।
వృద్ధికాఁగమీరలిద్ధచరితు।
లార! కరుణఁజూపఁగోరెదననిశంబుఁ।
జాలఁగొలుతుమిమ్ముఁగేలుమొగిచి॥

భీమవరము,
ది 15 జనవరి 98.

ఇట్లు, విధేయుఁడు,
చెన్నాప్రగడ రామమూర్తి.



శ్రీ ర స్తు.

# స్త్రీ నీ తి ర త్నా క ర ము.

క॥ శ్రీకరుఁడు సర్వశక్తుఁడు।
లోకేశుఁడు సర్వసాక్షి లోకనుతుఁడున్।
శ్లోకుఁడు శాశ్వతుఁడైచను।
వాకళ్యాణగుణుని నీశు నాత్మఁదలంతున్॥౧॥

గురుస్తుతి.

క॥ గురునిన్ గురుతరకవితా।
పరునిన్ నందూరివంశపాథోధిసుధా।
కరునిన్ శంకరసత్కవి।
వరునిన్ హృత్కమలమందుఁ బ్రస్తుతిఁ జేతున్॥౨॥

దైవభక్తి.

క॥ ఎవ్వఁడొ లోకాధారుం।
డెవ్వఁడొ పరిశుద్ధుఁ డాద్యుఁ డెవ్వఁడొ యభవుం।
డెవ్వఁడొ సర్వవ్యాపకుఁ।
డెవ్వఁడొ యవ్విభుఁడె దేవుఁ డెప్పుడు మనకున్॥౩॥

క॥ వనితామణి! మది మఱువక।
వనఘాత్ముఁడు లోకనాథుఁడైచను దేవున్।
మనమున నీవనుదినమును।
నుతింపఁగవలయు నమ్మ విశ్రుతభక్తిన్॥౪॥

## స్త్రీరత్నాకరము.

క॥ మేనుఁ దెలియరానినిదురఁ।
బూనినతఱినన్నుఁగరుణఁబ్రోవుమటంచున్।
మానిని! రాతిరిదేవునిఁ।
ధ్యానముసేయంగవలయుఁదద్దయుభక్తిన్॥ ౧॥

### పతిభక్తి.

క॥ పతియేదైవమనూహుఁడు।
పతియేసతతంబుభోగభాగ్యావళియూ।
పతియేధనముంబ్రాణము।
పతియేసకలమ్ముసుమ్ముభామలకెల్లన్॥ ౨॥

క॥ నాతికినిరతంబునువి।
ఖ్యాతినిఁగలుగంగఁజేయఁగాఁజాలినదీ।
భూతలముననాభరణము।
పాతివ్రత్యంబెపరమపావనమగుచున్॥ ౩॥

క॥ పతికడుఁగురూపియైనను।
హితమతిఁదత్సేవఁజేయుటెప్పుడుసతికిన్।
క్షితినతులితభూషణమగు।
సితరత్నాభరణములుకాంతిహీనంబులగున్॥ ౪॥

క॥ పనినుండివరుఁడువచ్చిన।
వినయవినమితాంగివగుచువెలఁదుక! సద్భా।
షణగణములశ్రమమాన్పుము।
పనివడిపాసుగింధ్యపోయువచియుంపవుమీ॥ ౫॥

క॥ నీపతి యెవ్వఁడైననమిత।
కోపనుఁడైతిట్టి పట్టి కొట్టిననతనిన్।
వోపికఁ జూపుచు లేశము।
కాపట్యముఁ జూపఁబోకు కాంతుని యెడలన్॥౧౦॥

క॥ ఎప్పుడు పతి చెప్పినపనిఁ।
దప్పక చేయుచు నుభక్తిఁ దచ్చిత్తముగా।
ప్పొప్పఁగ నవలంబించుచు।
నొప్పిదమగు మెప్పు జెందుమో కళ్యాణీ॥౧౧॥

క॥ పెనిమిటి దుష్టుండైనను।
వనితామణి! నీవు నీతి వచనచయంబుల్।
మనమున నాటఁగఁ గఱపుము।
గొనకొని నిందించు టెపుడుఁ గూడదు సుమ్మీ॥౧౨॥

క॥ లలనామణి! కల్లైననుఁ।
దలపోయకు వరునిదోషతతులను సతతం।
బెలనతఁడతులితదుష్కృత।
ములఁ జేసిననీవు తాన్ని బోధింపవలెన్॥౧౩॥

క॥ పతులగుదురంగహీనులు।
సతులకుఁ దప్పకను దైవసంకల్పమునన్।
క్షితినెప్పుడు దూషింపక।
మితిమీఱినభక్తితోడ మెలఁగఁగవలయున్॥౧౪॥

ఎదిఁగోరకు పరపురుషుల।
సతీమణి! వారలెంతసుందరులైనన్।

జెదరకతృణముగ నెంచినఁ
గవ శాశ్వతకీర్తిఁ గలుగు మజగతిన్ ॥౧౫॥

క॥ మగఁడిలవశ్యుండగునని
దగమందులు మాంత్రికులొసఁగఁ దగ దదియొకటా
దెగుళులఁ దెచ్చుఁ బతిఁ గనిన
దిగనాడఁ దొల్తొంటిప్రేమ దృఢకోపమునన్ ॥౧౬॥

క॥ కాంతామణి! యెన్నఁడునీ
కాంతుఁడు గృహమందు లేని కాలమునందున్
సంతసమందుచుఁ జారుల
కాంతాదుల మేనఁ బూన నాశింపకుమీ ॥౧౭॥

గురుభక్తి.

క॥ అరయంగ విద్యఁ గఱపిన
గురువరుఁ దనతండ్రిఁ బోలె గురుతరభక్తిన్
నెరపుచుఁ గృతజ్ఞతగలిగి
తరుణీమణి మెలఁగవలయుఁ దా వినయంబున్ ॥౧౮॥

క॥ ముద్దియ! నీకిలబుద్ధియు
విద్దెయుఁ గఱపి కడువేడ్క విమలపథంబున్
బెద్దగఁ జూపిన గురువరుఁ
దద్దయుఁ బూజించుట వరధర్మము గాదె ॥౧౯॥

సత్యము.

క॥ ధరనఖిలసుఖంబులకా
కరమై కరముల్లసిల్లుఁ గలికిరో! సత్యం

బరయఁగనది లేకుండిన।
వరధర్మసమూహమెల్ల వ్యర్థము గాదే॥ ౨౦॥

క॥ కావున సాధ్వీరత్నమ!।
నీవనవరతంబు సత్యనియతిఁగలుగుటన్।
వావిరిగఁగోరుకొనుచెడ।
భూవినుత లసద్యశంబుఁబొందెదవుసుమీ॥ ౨౧॥

క॥ అరయన సత్యములాడుట।
దురితంబులకొఱకుఁగానఁదొడరిధరిత్రిన్।
నిరతము సత్యమె పలుకుము।
దొఁగకొనునిహపరసుఖములతులితములగుచున్॥ ౨౨॥

క॥ ఉల్లసిలుచునుల్లంబునఁ।
గల్లలు కొల్లలుగఁబలుకుగల్లరినయముం।
జెల్లరు సమ్మఁగనొల్లరు।
పల్లవపాణి! పిదపనిలఁబ్రతికినఁబరువే॥ ౨౩॥

క॥ హాస్యంబునకైనను నరి।
హాస్యంబునకైనఁగల్లలాడవలదు జం।
ద్రాస్యలవశ్యముఁబ్రతుకఁగ।
హాస్యంబగుననృతమాడునతివ తనెవ్వతున్॥ ౨౪॥

" ఒకసారితప్పు చేసిన।
ప్రకటన్ మాఁడఁబోక తొప్పకొనుమి తెయుఁ;
కపాంకినచో వెంటనె।
కటికి ఱెండ్రొనునుమ్మ తొఁగ్యతబెడచున్॥ ౨౫॥

## బంధుప్రీతి.

క॥ తలపోయఁగజననీజన।
కులుతోఁబుట్టువులెగాక కుటిలాలక!నీ।
కిలబంధుజనములుందురు।
కొలిమినెరవువారిమెడఁజిత్తములలరన్॥౭॥

క॥ అత్తామబిడ్డలెప్పుడు।
క్రొత్తడి!నినుఁగోరిమెచ్చుకొనుక్రైవడిఁద।
చ్చిత్తమెఱిఁగివర్తించుము।
హత్తింపుమువారిమదులనానందంబున్॥౬౭॥

క॥ బావలనన్నలపగిదిని।
దేవరులనుతమ్ములట్లు తేకువతోడన్।
నీవిలనత్తనుఁదల్లిగ।
భావించిననీకునఖిలభాగ్యములొదవున్॥

## సత్సహవాసము.

క॥ మహిననవరతంబునుస।
త్సహవాసమొసేయఁగోరుసంతసమెసఁగన్।
మహితగుణాఢ్యులబ్బును।
మహిళామణి!నిన్నుజనులుమన్ననసేయన్॥౭౯॥

క॥ జారిణులతోడనిరవి।
దూరలతోనీచసతులతో దుష్టులతో।
నారీరత్నములెన్నఁడుఁ।
గోరంజనదన్నుచెలిమిగాంచంగెననన్॥౩

# స్త్రీనీతిరత్నాకరము.

## విద్య.

క॥ ఇలవిద్యయొసఁగువినయము।
వెలయఁగవిజ్ఞానమిచ్చువిదితయశంబున్।
బాలయుందునుగానబాలతి।
చెలువుమిగులవిద్యనభ్యసింపఁగవలయున్॥౩౧॥

క॥ పడతుక! పాటుపడిచదువఁ।
గడఁగుముమఱియున్నస్వల్పకాలమెబడిలో।
నిడుదురునీతల్లిదండ్రులు।
పడయుటకష్టంబుపిదపఁబాటకటవిద్యన్॥౩౨॥

క॥ ధరనుద్యోగములొనరిం।
తురెకొచెచ్చెరవిద్యనేర్చితొయ్యాలులనుచున్।
బరుసములువలుకువారిని।
నిరసించుచువిద్యలెల్లనేర్పికొనఁదగున్॥౩౩॥

క॥ సుదతులిలవిద్యనేర్చినఁ।
జదువఁగలరుపుణ్యసతులచారిత్రంబుల్।
మదిముదమందుచువారల।
పదవిననుసరింతురమ్మపాయనివేడ్కన్॥౩౪॥

క॥ చక్కదనంబునకునుమఱి।
చక్కతొడవులకునఁదోడువిద్యయుఁగలుగన్।
మెఱుఁగుసానబట్టిన।
మానికముగాదె? సాధ్వికుమారీ॥౩౫॥

క॥ లలితవిభూషాంబరములు।
కలిగియుఘనవిద్యలేక (గ్రాలెడు కాంతా।
తిలకములు దలంచి చూడఁగఁ।
బొలుపగు పరిమళము లేని పువ్వు లమ్మా॥ ౩౬॥

క॥ చదువెఱుఁగక విహరించెడు।
మదవతి యిలభార్యయైన మగవాఁడకటా!
ప్రమదుఁడు కన్నకామతి యయుట।
సదుపాయమటంచు నెంచు సౌఖ్యము లేదిఁక॥ ౩౭॥

## సద్గుణములు.

క॥ నగలున్నఁ జీరలున్నను।
మగువరో! చక్కఁదనమున్న మహిళావళికిన్।
నగఁగీతిఁ గానఁగఁ జాలిఁ।
సుగుణంబులు లేకయున్నఁ జూడరు లోకుల్॥ ౩౮॥

క॥ మణిగణమయ భూషణఘన।
ధనసంపద లేకయున్నఁ దరుణీమణికిన్।
గణుతింతురు చాలఁగ వర।
గుణసంపదఁ గలిగియున్నఁ గోవిదు లెల్లన్॥ ౩౯॥

క॥ మానుగ దైవంబిచ్చిన।
దానిని ఘనమంచు నెంచి తానెల్లప్పుడున్।
మానిని! తృప్తి వహింపన।
మానసుఖానికమందు నునిజము జగతిన్॥ ౪౦॥

# శ్రీసీతారత్నాకరము.

## చౌర్యము.

క॥ ననునెవ్వరుజూడరటంచే।
దనిచౌర్యముసేయఁబోకుమల్లనసర్వం।
బునువీక్షించుచుదైవము।
వెనుకొనియుశాపమునుమ్మభీకరుఁడగుచున్॥

క॥ దొంగపనిఁజేయుజనులా।
యంగనఁదమఁజేరనీయరవ్వలజగతిన్।
దొంగదఁటందురుకీర్తికి।
భంగమువాటిల్లుఁజాలఁబాపముగలుగున్॥౪౨॥

క॥ పరధనమొకతృణమైననుఁ।
దరుణీమణి! తాకఁబోకుతగదదియొక్కా।
నరయమితేఁదీసినసీ।
ధరణినపయశంబువచ్చుఁదథ్యముసుమ్మీ॥౪౩॥

## త్యాగము.

క॥ ధనపతిననిగర్వింపక।
యొనరింపఁగవలయునమ్మయువిదరో! సతతం।
బునుధర్మమంగహీనుల।
కునుగనద్దానివలననగుపుణ్యంబుల్॥౪౪॥
కంబొనరించినఁగడు।
గుపుణ్యమంచునెత్తితలఁపులో।
ంటనుదొంగిలి।
ంపజనదమ్మదానావళులన్॥౪౫॥

క॥ వందించిన నెవ రైనను।
సుందరి! యుప్పొంగియున్న సౌమ్యమునమీ।
ముందుఁ గనిశక్తి నరసి।
పొందుగ ధర్మంబు సేయఁ బూనుము జగతిన్॥౪౬॥

మితవ్యయము.

క॥ కడునిడుమలఁబడి నాథుఁడు।
గడియించిన విత్తమెల్లఁ గ్రోలుచుఁ బుడమిన్।
జెను వెచ్చంబులఁ జేయం।
గడఁగఁ జనదు దానమగఁడు కష్టము నొందున్॥౪౭॥

క॥ చాలదు తే తెమ్మని వరుఁ।
జాలఁగ బాధింప రాదు సంతసమెసఁగన్।
వీలెఱిఁగి యున్నవట్టుకె।
వాలుంగంటి! గడుపుకొనవలయుం జుమ్మీ॥౪౮॥

క॥ ధనవతులిలధరియించెడు।
ఘనభూషణవస్త్రతతులఁ గనుఁగొని వనితా।
మణులెల్ల వానిఁదమకునుఁ।
గొనుమని వరుల విసికింపఁగూడదు సుమ్మీ॥౪౯॥

క॥ అతివరో! లెస్సగఁ గలదని।
యతిసంతోషంబుతోడ ననవరతంబున్।
తృపినూలకవ్యయపరచక।
మితముగ వాడుకొనవలయు మెలఁకువతో

## అహింస.

క॥ పొలతుక! నీపాదంబున।
ములువిఱిగిన నెంతశ్రమముపుట్టునొ సుమతీ!।
తెలిసికొని జీవహింసల।
నిలఁజేయకు బాధలన్ని యెన్నఁగ సమముల్ ॥౫౧॥

క॥ ధరనాటలాడుకొని యెడ।
తరుణంబున నైనజీవతతులకు బాధల్।
బొరయింపక దయఁదలఁపుచుఁ।
దరుణీమణి యాడఁదగునుఁ డా నెల్లపుడున్ ॥౫౨॥

క॥ పామరమతులై భువిలో।
జీమలు మొదలైన యల్పజీవుల నెపుడున్।
లేమరొ! కార్యంజూపఁగఁ।
బాముచునుందురకటకట! పాపముగాదే? ॥౫౩॥

క॥ ఓవనితామణి! యిటువిను।
మీవనయము జీవకోటి మీఁడదయగనిన న్।
వేవేగ మెతా మెచ్చుచు।
దైవము ముదమంది నిన్నుఁదప్పకఁ బ్రోచున్ ॥౫౪॥

## కోపము.

...ము సద్గుణగణముల।
...నుఁ బాపములఁ బెంచు మహానవిరళసం।
...ముఁ బూవును గావునఁ।
...ఁ బూనఁగఁదగదదిగో ష్ట్యముఁ—

క॥ పనివారలనాపనిసీ।
పనిఁజేయుమటంచుఁబోలతిపల్కరుఁగోపం।
బునఁబరుషంబులుపలుకక।
పనిఁగొను మెప్పునను మంచిపలుకులతోడన్॥౫౬॥

క॥ అసువులువిసుగఁగ దాసీ।
విసరంబునుఁగసరినఁబనివీసంబైనన్।
వెసఁజేయరుసరసిజముఖి!।
యసూయచేఁజెడ్డదండుఁరనిశమునిన్నున్॥౫౭॥

క॥ మగువరో!"చెలిమింజేదిడ।
నగుబలిమించాలుఁపోయనలవియె?"కాన్।
దగమంచితనంబునఁబని।
జగతింగొనవలయుఁగానిచనదొంటుగతిన్॥౫౮॥

గర్వము.

క॥ ధనముంజకరోందనముం।
గనుఁగొనితగఁగ్రిందుమీఁదుఁగానకమగుడన్।
దనపాటివాఁడులేరని।
వనితామణిగర్వమందవలవదుసుమ్మీ॥౫౯॥

క॥ సంపదగుణసంపదయునుఁ।
బెంపెసఁగఁగఁజాలునట్టివినయంబునుఁ,
శ్లాఘింపుగధరియించుపకవిహా।
మితముగనియెప్పించుకాంతప్రేమింపనగాం

క॥ వినయవిధేయతలుగలిగి।
యనిశంబును మెలఁగుసతులనందరుభువిలో।
ఘనముగఁజూతురు నాతిరో!॥
వినుమలఁతిగఁజూచివిట్లువిగెడువారిన్॥౬౧॥

క॥ పొలుపుగనీ కెంతకలిమి।
గలిగిననొక్కింతయైననగర్వపడకుమీ।
తలపోయంగఁగలిమిలే।
ములు కావడికుండలనుచుమును వినలేదే॥౬౨॥

క॥ లలితాంగి! సిరులుతిరమను।
దలఁపునగర్వింపఁబోకుదైవాజ్ఞ మెయిన్।
బలిమియుఁగలిమియుదొలఁగిన।
నిల నెకసకెమాడుచుందురెల్లరునిన్నున్॥౬౩॥

శరీరారోగ్యము.

క॥ కాయము గాపాడుకొనను।
పాయముజూడంగవలయుఁబాయకనీవో।
తోయజముఖి! యివిమదిదల।
పోయఁగధర్మములలోనముఖ్యముసుమ్మీ॥౬౪॥

కవివనమునసొగిస్నానం।
బరింపఁగవలయునమ్మయోపికతోడన్।
మనిముదికెపోవఁగ।
నా! పుట్టుసేయకున్నవ్యాధులుగ

క॥ నిరతము స్నానము మానక।
సరగున మఱి ముఱికి లేక చను వస్త్రంబున్।
ధరియింపవలయు నయ్యాది।
కరము విలువ లేనిదైనఁ గానిమ్ము సతీ॥౬౬॥

క॥ ఎండనకను వాననకను।
మెండుగ స్నానములు జేసి మెలతుక! ధరణిన్।
దండిగ నాచారంబుల।
నుండిన నీ దేహ మెప్పు డుండదు సుగతిన్॥౬౭॥

క॥ కలుషజలంబులు ద్రావినఁ।
గలుగును నిక్కంబు తెవులు గావున జగతిన్।
నెలతలు వడియం గట్టిన।
జలములు గ్రోలంగవలయు సౌఖ్యముకొఱకున్॥౬౮॥

క॥ "హితమౌ పదార్థ మైనను।
మితముగఁ దినుమ" న్నమాట మెలతుక! వినవే।
మితి తప్పి భుజించినచోఁ।
క్షితిఁ గలుగుట తెవులు నీకు సిద్ధము సుమ్మీ॥౬౯॥

క॥ గడగడ నాడలాగి వడకఁగ।
పడతుక! తడిబట్టఁ గట్టి పనులనుఁ జేయం।
గడఁగఁగ రాదెన్నండునుఁ।
గడువడి నాడ లెల్ల జెడెదు కాలము వచ్చున్

క॥ చెడు గాలి తగిలిన నాడలు।
[illegible] ములంటునన్నా చేడియ! యెవుడు[illegible]
మితముగ[illegible]

దడవానరింపకవాకిటఁ।
బడియుండెదుకుళ్ళునంతఁబాపఁగవలయుఁ౯॥౭౧॥

శరీరకష్టము.

క॥ కష్టపడినబలమొదవుం।
గష్టపడినవ్యాధులేమికలుగకయుండుఁ౯।
గష్టపడినసుఖముగనిలఁ।
గష్టపడఁగవలయుసుఖముకలుగుటకొఱకుఁ౯॥౭౨॥

క॥ ధనమింతయుండదాసీ।
జనులిందరుగల్గియుండసదనముననిసీ।
పనిసేయఁగనాకేమని।
తినియుండకకష్టపడుముదీర్ఘాయువగుఁ౯॥౭౩॥

క॥ ఒడలలయునను చుఁదలఁపక।
పుడమిందగఁగష్టపడినఁబాలతుకలెప్పుడుఁ౯।
బడయుదురెల్లసుఖంబులు।
నువురేఁ"కష్టీఫలీ"యనుచునార్యులిలఁ౯॥౭౪॥

శాంతము.

క॥ ఇంతి! యఖిలధర్మంబుల।
కెంతయునొకశాంతగుణమె యిమ్మగశోభఁ౯।
శాంతతమెచ్చఁగానా।
ంతమునుఁదాల్పవలయుఁజానలుపుడమిఁ౯॥౭౫॥
సుజనులొకవేళఁ।
నేరంబువారిఁజీరికుమాగి।

జక్కఁగ నుపకారంబును।
మ్రుక్కక జేయంగవలయుఁ జుమ్మీ పరులకున్ ॥౨౧॥

క॥ తనువులు శాశ్వతములు గా।
వనయము జేతలు దిరంబు లవనీస్థలిలో।
వనితామణి! గావున నీ।
వొనరింపు మెపుడు నుపకారము మోరులకు వేడ్కన్ ॥౨౨॥

క॥ లలనా! పరులిమ్మనఁబడి।
పిలపించెదు సమయమందు వేగమ చనివా।
రలకుపకారముఁ జేయుమి।
యలరిమతులనీకు వారలటులొనరింపన్ ॥౨౩॥

క॥ పగవారలైనఁ దెగుళులఁ।
దగిలిపొగులుచుందు రేనిఁ దరుణీ! వారిం।
రొగడకతో మెపడుచుమణి।
దగుమాటలనూఱడింపఁదగు దయతోడన్ ॥౨౪॥

## ధైర్యము.

క॥ ఇడుమలు వచ్చిన వేళల।
బడతుక! ధైర్యంబు విడువవలవదు సుమ్మీ।
పుడమిం దగ ధైర్యంబున।
నిడుమలు సగమడఁగిపోవు నెంతటివైనన్ ॥౨౫॥

పడవచ్చిన భామిను।
ట్టిన ధైర్యమెడలి యడలిన హో

దయాపదయత్యధికంబై।
చూపట్టునుగూడిరాదుసుమిలేశంబున్॥౨౬॥

బాలశిక్ష.

క॥ బిడ్డలుచేసినసల్లరి।
యొడ్డితనంబెసఁగఁదిట్టియొన్నండునుఁదా।
గొడ్డునుఁగొట్టినయట్టుల।
గడ్డలిగివెలందికొట్టఁగాఁజనదుసుమీ॥౨౭॥

క॥ మాటకిబిడ్డలగొట్టిన।
బోటిరో!క్రమమోటుబారిపోవుచుమతియున్।
జేటగునాయువుపట్లగు।
చోటులనదితాకెనేని స్రుక్కిఁగఁజేయున్॥౨౮॥

క॥ కొట్టినఁదిట్టినమొట్టిన।
మెట్టినబాలురకుభీతిమిక్కిలిమదులన్।
బుట్టదుతగుమాటలచే।
గట్టిగఁజెప్పంగవలయుఁగడకొనిభయమున్॥౨౯॥

వివిధధర్మములు.

క॥ ఇతరులునీకేవిధమున।
సతతముజేయవలయుననిసంతసమునసీ।
మతెదలఁచెదవోసతి!యా।
గతినేనితరులకునీవుగావింపవలెన్॥౩౦॥

క॥ ...సంపదఁగనఁగొని।
మితముగ...గోర్వలేమిమహితుచ్ఛగుణం

బతివలు! కావున వానిని।
సతతము విడువంగవలయు జాగ్రత్తతోడన్ ॥౯౧॥

క॥ నీకొంపులోనరించిన మే।
లే కాలమునందు మఱువ కించుకయైనన్।
జేకొనివారికినగ్మిరిఁ।
బ్రాకటము తిమరల మేలు వలయును సలుపన్ ॥౯౨॥

క॥ కడు పాఱఁగుడిచి నిలుచుచు।
నడివాకిట నిరుగుపొరుగు నారులతోన।
కడవారి వీరి తప్పులు।
తడవ్వుట దుర్గుణము సుమ్మి తరుణికి నెపుడన్ ॥౯౩॥

క॥ పనిలేక యెపొరుగిండ్లకుఁ।
జనియచ్చటఁ గూడుతోడి చానలకెపుడున్।
గొనకొని గృహకృత్యంబులు।
వినుపింపకుమన్న నీవు వేడుకతోడన్ ॥౯౪॥

క॥ పనిలేని సమయమున వా।
రిని వీరినిఁ జేరఁదీసి గృహమునకతివా।
యనుచితపుఁ గోష్ఠి నుండఁగఁ।
జనదు పతివ్రతల కథలఁ జదువుము వేడ్కన్ ॥౯౫॥

రాకేందువదనఁ దాఁదల।
వాకిటఁ జేరి పొరుగింటివారల నెపుడున్।
ంకొని రారమ్మంచునుఁ।
ఌలు వేసినగ రాదు కీడగుసుమ్మీ ॥౯

క॥ ఇలఁగలభాగ్యంబంతయుఁ।
బాలతికీవరుఁడేయటంచుఁబొందుగమదిలోఁ।
దలఁపోయుచుసేవింపుము।
కలకాలముజనులుమెచ్చఁగానినుఁగలికీ॥౧౦౭॥

క॥ సతివైయనుపమవిద్యా।
వతివైసకలసుగుణతతివైభూరికృపా।
మతివైసంతతనయపథ।
యుతవైవెలుగొందుచుండుముర్వీస్థలిలోన్॥ ౧౦౮॥

క॥ పదిలంబుగఁబరికించిన।
సుదతీమణి! దీనినీవుసుజ్ఞానమిడున్।
మదిఁదలఁచిసులభశైలిని।
ముదమునరామలకురామమూర్తిరచించెన్॥ ౧౧౦॥

సంపూర్ణము.



మితముగ

